SRI VENKATESWARASWAMIVARI TEMPLE,
TIRUMALA

# REVISED PROGRAMME OF ROUTINE PUJAS AND DARSANAM Etc

## SATURDAY TO WEDNESDAY

| | | |
|---|---|---|
| 3-00 A M | to 3-30 A M | Suprabhatham (No admission) |
| 4-00 A M | to 5-30 A M | Thomalaseva (Arjitham) |
| 6-00 A M | to 7-00 A M | I Archana (Arjitham) |
| 7-30 A M | to 8-00 A M | I Bell and Sathumorai |
| 8-00 A M | to 1-00 P M | **Sarva Darsanam** |
| 1-30 P M | to 2-00 P M | II Archana (Private), II Bell |
| 2-00 P M | to 9-00 P M | **Sarva Darsanam** |
| | 10-30 P M | Ekanthaseva (Arjitham) |

## ON THURSDAY

| | | |
|---|---|---|
| 3-00 A M | to 3-30 A M | Suprabhatham (No admission) |
| 4-00 A M | to 5-30 A M | Thomalaseva (Arjitham) |
| 6-00 A M | to 7-00 A M | I Archana (Arjitham) |
| 7-30 A M | to 8-00 A M | I Bell and Sathumorai |
| 8-00 A M | to 12-00 Noon | **Sarva Darsanam** |
| 12-00 A M | to 12-30 P M | Sallimpu |
| 1-00 P M | to 1-30 P M | II Archana (Private) |
| 2-30 P M | to 5-30 P M | **Sarva Darsanam.** |
| 6-00 P M | to 8-00 P M | Kainkairyam, Poolangi-Samarpana & Bell |
| 8-00 P M | to 10-00 P M | **Poolangi Darsanam (Arjitham).** |
| | 10-30 P M | Ekanthaseva (Arjitham) |

## ON FRIDAY

| | | |
|---|---|---|
| 4-00 A M | to 4-30 A M | Suprabhatham (Private) |
| 7-00 A M | to 9-30 A M | **Abhishekam (Arjitham)** |
| 12-00 Noon | to 12-30 P M | Thomalaseva (Private) |
| 1-00 P M | to 1-30 P M | Archana (Private) |
| 2-00 P M | to 2-30 P M | Bell and Sathumorai |
| 2-30 P M | to 9-00 P M | **Sarva Darsanam** |
| | 10-30 P M | Ekanthaseva (Arjitham) |

**Note —**

Pilgrims will not be allowed for Suprabhatham

(ii) Nityarchana Grihasthas will be permitted for 1st Archana only 2nd Archana also will be made Arjitham in case there is no heavy crowd

(iii) Thomalaseva and Archana on Fridays also will be made Arjitham if there is no heavy crowd

(iv) The main entrance of the queue gate near the Mahadwaram (Padikavali, adjacent to Peishkar's Office) will be closed by 12–00 Noon on all the days other than Thursdays and by 11–00 A M on Thursdays Sarva Darsanam will be restored again from 2–00 P M after II Archana and II Bell The pilgrims who join the queue inside the queue gate for Sarva-Darsanam before closing of the queue entrance gate at the appointed time will be afforded Sarva-Darsanam facilities

(v) On Festival and other special occasions there will be changes in the temple timings and these will be notified to the public in the temple and in the Enquiry Office Notice Boards and will also be announced through the loud-speakers

EXECUTIVE OFFICER,
*T T Devasthanams*

# AN APPEAL

The subscriptions of the following numbers will expire on 31—7—1970 Supply of the Journal will be stopped from that date onwards if the subscriptions are not renewed

Subscribers are requested to mention always their subscription number, present postal address (in block letters) and period of subscription, (New subscribers always shall write the term ' New Subscription " in the M O coupon and send in advance before 25th instant) addressed only to the EDITOR, 'The SAPTAGIRI T T D, 'Tirupati (and not to any other address) Subscriptions of the Journal (Rs 3/-) should not be remitted clubbing with other items, as such remittances will not be accounted for the Journal in future All correspondence pertaining to the Journal should be made to the above address only

9, 34, 40, 99, 132, 134, 176, 239, 241, 261, 262, 265, 268, 357 367, 368, 369, 370, 371, 372, 377, 460, 489, 491, 492, 494, 495, 501, 572 594 595, 596 599, 686, 687, 689, 691, 692, 693, 695 697 845, 846, 848, 849, 851, 856, 857, 859, 860, 861, 862, 863, 866, 867,

1157, 1205 1253, 1254, 1257, 1258 1261, 1263, 1264, 1265, 1267, 1271, 1272, 1274, 1275, 1280, 1281, 1282, 1284, 1288, 1291, 1295, 1297, 1299, 1303, 1304, 1307, 1308, 1311, 1313, 1314, 1315, 1316, 1320, 1346, 1551,

2034, 2067, 2116, 2120 2144, 2158 2171, 2212, 2218, 2272, 2293, 2294, 2327, 2353, 2354, 2356, 2496, 2588, 2648, 2651, 2653, 2656, 2657, 2662, 2695, 2945,

3006, 3008 3016 3093, 3094, 3121, 3122, 3166, 3198, 3200, 3233, 3234 3236, 3298, 3300, 3303, 3304, 3306, 3432, 3433, 3434, 3435, 3437, 3438, 3439, 3440, 3455 3508, 3528, 3543, 3639, 3641, 3642, 3643, 3644, 3645, 3647, 3659,

4024, 4054 4056, 4064, 4069, 4070, 4071, 4075, 4076, 4078, 4079, 4080, 4082 4083, 4084, 4085, 4086, 4087, 4089, 4090, 4091, 4092, 4093, 4095, 4096, 4097, 4098, 4099, 4100, 4101, 4102, 4103, 4105, 4106, 4107, 4108, 4109, 4110, 4111, 4112, 4113, 4114, 4115, 4116, 4118, 4119, 4122, 4123, 4124, 4125, 4126, 4127, 4128, 4130, 4131, 4772, 4774,

5066, 5067, 5069, 5072, 5073, 5074, 5075, 5076, 5077, 5078, 5081, 5082, 5088, 5090, 5091, 5092, 5097, 5098, 5105, 5134, 6066, 6073

*Remittances to the Journal should be made through Money Orders, Postal Orders and Demand Drafts only*

# తెలుగు - విభాగము



## విషయసూచిక

# వేంకటేశ్వరా!

శ్రీమతి చుండూరి రమాదేవి,
ఏలూరు

మునుపొక మాట వింటి, నిజమో, మరికాదో యెఱుంగ నీవు నా
ధనదునివద్ద నప్పుగొని, దాన, మహాసతి పద్మనింటిదా
నినిగనొ నర్చుకొంటివని, నీదగు నారుణ మీగ భక్తకో
ట్ల నయము నిచ్చు గాన్కలవి యప్పున కౌనట వెంకటేశ్వరా।

అప్పటి యప్పు జిక్కుల మహోదార కిప్పటి కింకదీర, దే
ముప్పనొ బాపెభక్తులిడు ముడ్పులు గాన్కలు నిల్వదోపులున్
గుప్పలు దెప్పలన్ గొనుచు, గొబ్బున నారుణ మీదెడున్, మరిన్
వొప్పెడిదేమి? యెంతశ్రమనొందుచునుంటివొ వెంకటేశ్వరా!

ఎంతటియప్పొ, యా విభవమెంతగ నైనదొ నీదుపెండ్లి, సా
మంతులు నీశ్వరాది సురమాన్యులు ముప్పదిమూడుకోట్లు దా
మంతట దాము వచ్చి, ముదమారగ పెండ్లిపనుల్ సమస్తమున్
వంతులు వంతులన్ బడుచు వారక జేయరె వేంకటేశ్వరా।

ఆడిన పెండ్లియైన సుఖమాయెనె? యేకరివేసు కోసమో
యోడనిపట్టు దంపతులహో యెండొరులిరు కొండపై
నేడనొ నీవు నా డిగువ నేలను నీదొరసాని కాపురాల్
కూడునె సేయ నిన్ను ననగూడదు నిట్టిది వేంకటేశ్వరా।

కలినిల భక్తకోటులను గాచు దలంపున వేంకటాద్రిపై
వెలసిన దివ్యమూర్తి కడు విశ్రుత మయ్యెను నీదుకీర్తి, నిన్
దలచిన వారి బాముల నుదారత బాపి యనంత సౌఖ్యముల్
కలుగగ జేతువంట, దయగల్గదె నాపయి వేంకటేశ్వరా।

కరముల శంఖచక్రములు కౌస్తుభరత్నమురస్థలమ్ముపై
వరలగ, వాసవాది సురపూజిత పాదసరోరుహుండవై
కరుణ దలిర్పుజూపులను గారవ మొప్పగ భక్తకోటిపై
బరపుచు నుండు నిన్ను మది బాయక గొల్చెద వేంకటేశ్వరా।

# ధర్మప్రమాణములు

డా. దివాకర్ల వేంకటావధాని,
ఎం ఏ (ఆనర్సు) పి హెచ్ డి

హిందువుల శాస్త్రముల ననుసరించి ధర్మార్థ కామ మోక్షములకు చతుర్విధ పురుషార్థములని పేరు పురుషార్థ శబ్దమునకు "పురుషైరర్థ్యతే" పురుషులచే నర్థింపఁబడునది యని వ్యుత్పత్త్యర్థము ఇచ్చట పురుషులనగా సామాన్యముగా మానవులని విశాలార్థమును గ్రహింపవలయును ఈచతుర్విధ పురుషార్థములలో నర్థకామము లిహామునకును ధర్మమోక్షములు పరమునకును సంబంధించినవి సాధారణముగా మానవులలో నధిక సంఖ్యాకులైహిక పురుషార్థసిద్ధికే యత్నించు చున్నట్లుకనిపించును ఇది సహజమే విద్వాంసులు జ్ఞానవంతులు నైన కొందఱు మానవులు మాత్రము శాస్త్రగురువాక్యములందలి విశ్వాసముచే ధర్మమోక్షములను నాముష్మిక పురుషార్థముల సాధింప నభిలషించుచుందురు ఒక్కొక్కప్పుడీ యభిలాష సహజ సిద్ధము కాకపోవుటయు నైహికాభ్యుదయ ప్రవణతా ప్రేరితమై యుండుటయు సంభవించు చుండును అట్టియెడ ధర్మమోక్ష పురుషార్థము లుత్కృష్టములయ్యును వానిని సాధించు యత్నమున పరమార్థ లోపము గోచరించును సాధకుల సంఖ్యనుబట్టియు, చిత్తశుద్ధి సంపదనుబట్టియు మాడనర్థకామములు ప్రధాన పురుషార్థము లైనట్లును, ధర్మమోక్షము లానుషంగికము లైనట్లును కనిపించును కాని యది యథార్థముకాదు సూక్ష్మముగా పరిశీలించు వారి కైహికములైన యర్థకామములకంటె నాముష్మికములైన ధర్మమోక్షములె యుత్కృష్టతరములును వాంఛనీయములునైన పురుషార్థములని తెలియవచ్చును వాని కొఱకు యత్నించి సిద్ధి పొందుటయందే మానవ జీవితము సాఫల్యము నొందజాలును

"ధ్రియతే ఇతి ధర్మః' 'ధరతీతి ధర్మః" అను నర్థములనుబట్టి ధరింపఁబడుట, ధరించుట లేక రక్షించుట యను రెండులక్షణములును ధర్మము నందిమిడియున్నవని తెల్లమగు చున్నది ప్రపంచమునందలి జంతువులన్నియు కాలభేదమునుబట్టి పతనోత్పతనములను ఉచ్చనీచస్థితులను పొందు చుండును ఇవి కేవలము యాదృచ్ఛికముగా జరుగునట్టివికావు పరిహార్యములును కావు వీనికి పూర్వకర్మముల పరిణామమే కారణము పతనమునకు మూలముకాక, జంతువులను సుస్థితిలోనుంచి, వాని యభ్యుదయమున కవకాశమొసంగు కర్మము

నకే ధర్మమని పేరు, అట్లుకాక పతనమునకు హేతువై జంతువును నీచస్థితికిఁ గొని పోవునది అధర్మము దీనికే పాతకమని నామాంతరము పాతకమనగా పడునట్లు చేయునది యని యర్థము

జైమిని మీమాంసా సూత్రములలో యజ్ఞాది కర్మముల యథావిధిగా నాచరించుటయే ధర్మమని చెప్పియుండెను వేద చోదితకర్మ కలాపమును నిష్కామ బుద్ధితో నాచరించువారు మోక్షమును, సకామబుద్ధితో నాచరించువారు దివ్యలోకములను బొందుదురని పూర్వ మీమాంసకుల విశ్వాసము వైశేషిక సూత్రకర్త కణాదుఁడు "యతోభ్యుదయ నిశ్శ్రేయససిద్ధిః స ధర్మః" అని ధర్మమును నిర్వచించెను ఐహికాముష్మికాభ్యుదయ ప్రాప్తియు, మోక్షమును దేనివలన సిద్ధించునో అది ధర్మమని యతని యభిప్రాయము కణాదుఁడుకూడ వేదములయు వేదమూలములైన శాస్త్రములయు ప్రామాణ్యము నంగీకరించు వాఁడే అభ్యుదయ నిశ్శ్రేయసములను కలిగించునదేది? యను ప్రశ్నకు సమాధానమువడయుటకై మనము కేవల హేతువాదముపైనే కాక శాస్త్రములపై కూడ నాధారపడవలసి యున్నది

బాదరాయణ బ్రహ్మసూత్రములును, వాని పై శంకర భగవత్పాదులు రచించిన భాష్యమును సూక్ష్మార్థ నిర్ణయ విషయమున శాస్త్ర పరిశీలనములేని కేవల హేతువాదము (తర్కము)పై నాధారపడరాదని చెప్పుచున్నవి. (తర్కాప్రతిష్ఠానాత్ II-I-II నిరాగమాః పురుషోత్ప్రేక్షా మాత్ర నిబంధనాస్తర్కా అప్రతిష్ఠితాభవన్తి ఉత్ప్రేక్షాయా నిరంకుశత్వాత్) తర్కము లేక హేతువాదము మానవుడు బుద్ధిబలమున నొనర్చు నూహ బుద్ధిబలము ననుసరించి యొక మేధావి యొనర్చు నిర్ణయమును బుద్ధిమత్తరుఁడైన యింకొకడు నిరసించి యింకొక నిర్ణయమును ప్రతిపాదించును మూడవవాడు పై యిరువురి నిర్ణయములను ఖండించి తానింకొక సిద్ధాంతమును ప్రతిష్ఠించును కావున కేవల తర్కసాహాయ్యమున అప్రత్యాఖ్యేయమైన నిర్ణయమును నిశ్చితార్థముగా ప్రతిపాదించుట కవకాశములేదు అందుచే నతిసూక్ష్మమైన ధర్మవిషయమును కేవలతర్కముపై నాధారపడి యిదమిత్థమని నిర్ణయించుట యుక్తముకాదు వాక్యపదీయ కారుడైన భర్తృహరి నేర్పరులు ననుమాతలునైన మేధావులచే నతి ప్రయత్నమున ననుమితమైన యర్థముకూడ నభియుక్తతరులైన యన్యులచే నన్యవిధమున నుపపాదింపఁబడును కావున శాస్త్రములచేకాక తర్కముచే ధర్మమును నిశ్చయించుట యుక్తము కాదని చెప్పియుండెను

(నహ్యాగమాదృతే ధర్మ స్తర్కేణ వ్యవతిష్ఠతే)

ధర్మపదముయొక్క యౌగికార్థము నెఱింగినంత మాత్రమున నిష్టార్థ సిద్ధి చేకూరదు దానిని సక్రమముగా నాచరించినప్పుడు మాత్రమే యాసిద్ధి

సమకూడును ధర్మము నాచరింప యత్నించుటకుముందు దానియర్థము నెఱుంగవలసిన యావశ్యకత లేకపోలేదు కాని యీ యర్థావగతి తర్కైక జన్యమగుచో నభ్యాసకుని హృదయమున ధర్మమునుగూర్చి నిశ్చితమైన యభిప్రాయము కలిగింపఁజాలదు అందుచే వేదమత విషయముననే కాక సర్వమతముల విషయమునను ధర్మార్థ నిర్ణయమున శాస్త్రప్రామాణ్యమే యనవద్యమైనదిగా పరిగణింపఁబడుచున్నది శ్రీకృష్ణభగవానుడుకూడ భగవద్గీతలో "తస్మాచ్ఛాస్త్రం ప్రమాణంతే కార్యాకార్య వ్యవస్థితౌ" అని కార్యా కార్య నిశ్చయమున శాస్త్రమే ప్రమాణమని వక్కాణించి యున్నాడు

భారతీయ సాంస్కృతిక విషయములందు ధర్మనిర్ణయమున శాస్త్రములకత్యంత ప్రామాణ్య మంగీకరింపఁ బడుచున్నను తర్కము పూర్తిగా పరిహరింపఁబడుట లేదు శాస్త్రతత్త్వ వ్యతిరేకికాని తర్కము నంగీకరించుటలో దోషములేదని పెద్దల యభిప్రాయము

"ఆర్షం ధర్మోపదేశంచ వేద శాస్త్రావిరోధినా యస్తర్కేణాను సంధత్తే సధర్మం వేదనేతరః" అనుశ్లోకమున మనువెవ్వరార్షమైన యుపదేశమును వేదశాస్త్ర విరుద్ధముకాని తర్కముచే ననుసంధింతురో వారే ధర్మము నెఱుంగుదురుకాని యన్యులెఱుంగరని చెప్పియున్నాఁడు ఈ విధముగ వేదమతమున న్యాయవైశేషిక సాంఖ్య యోగాది దర్శనముల సాహాయ్యముననే ధర్మార్థ పరిశీలనము కావింపఁబడు చున్నది

ధర్మమునుగూర్చి పూర్వమహర్షుల యభిప్రాయముల నీక్రింది విధముగా సంగ్రహింపవచ్చును

1 ఇహ పరలోకములు రెండింట నభ్యుదయము నావహించునదే ధర్మము

2 ధర్మవిషయమున శాస్త్రసంబంధము లేని కేవల తర్కము ప్రమాణము కాఁజాలదు ఈ విషయమున శాస్త్రవచనమే పరమ ప్రమాణము

3 ధర్మవిషయమున శాస్త్రమే పరమ ప్రమాణమైనను దానియర్థము నవగాహనము చేసికొనుటకు తర్కమునుగూడ సహాయముగా గ్రహింపవచ్చును కాని యా తర్కము శాస్త్రతత్త్వమున కనుకూలముగా నుండవలయుననే కాని విరుద్ధముగా నుండరాదు, ఈ విధముగా ధర్మనిర్ణయమున తర్కము ప్రధాన ప్రమాణముకాక పోయినను సంపూర్ణ తత్త్వ పరిశీలనమునకు తోడ్పడు నానుషంగిక ప్రమాణమని యంగీకరింప వచ్చును

---

# శ్రీ లక్ష్మీ కటాక్షసిద్ధిరస్తు

కాలామ్బుదాళిలలితోరసి కైటభారేః
ధారా ధరే స్ఫురతి యాతటిదఙ్గనేవ
మాతుస్సమస్త జగతాం మహనీయమూర్తిః
భద్రాణి మే దిశతు భార్గవ నన్దనాయాః

ఈ శ్లోకమునందు శ్రీమహావిష్ణువుయొక్క వక్ష స్థలముపై నున్న శ్రీమహాలక్ష్మి నీలమేఘముపైగల (తొలకరి మేఘము) మెఱపు తీగకు పోల్చబడినది అట్టి ప్రకాశవంతమైన లక్ష్మీదేవియొక్క దివ్య మంగళ రూపము మాకు సమస్త శుభంబుల నొసగుగాక

ఇది శ్రీ శంకరాచార్య విరచిత కనకధారాస్తవములోని నాలుగవ శ్లోకము లక్ష్మీకటాక్షమును గోరువారు కనకధారాస్తోత్రమును నిత్యము భక్తి శ్రద్ధలతో పఠించవలెను "సర్వేగుణాః కాంచన మాశ్రయిన్తే"

శ్రీ పద్మావతీ పరిపూర్ణ కటాక్షసిద్ధిరస్తు

సువర్ణ



# పాంచరాత్రంలో
# ప్రాణాయామం

—o—

శ్రీమాన్ యస్ బి రఘునాథాచార్య

( గతసంచిక తరువాయి )

## ప్రాణాయామ విభాగము

పూరకమునకు ఎనిమిది మాత్రలును రేచకమునకు పదునాఱు మాత్రలును, కుంభకమునకు ముప్పదిరెండు మాత్రలును, శిశుప్రాణాయామమున నుండును పూరకమునకు పన్నెండు మాత్రలును, రేచకమున కిరువది నాలుగు మాత్రలును, కుంభకమునకు నలుబది యెనిమిది మాత్రలును, మధ్యమ ప్రాణాయామముననుండును పూరకమునకు పదునాఱు మాత్రలును, రేచకమునకు ముప్పదిరెండు మాత్రలును కుంభకమునకు అరువదినాలుగు మాత్రలును, ఉత్తమ ప్రాణాయామమున నుండును లఘ్వక్షరము నుచ్చరించుకాలమునకు 'మాత్ర'యను వ్యవహారము శౌనక మతసిద్ధము

ఈ విభాగమునే లింగపురాణము కొంచెము భేదముతో నిట్లభివర్ణించు చున్నది 'ప్రాణాయామ మానము 12 మాత్రల కాలము ఒక యుద్ఘాతముతో కూడిన 12 మాత్రల మానముగల ప్రాణాయామము నీచమనబడును ఇది సాధకునకు శరీర మంతటను చెమటను పుట్టించును రెండు యుద్ఘాతములతో గూడి 24 మాత్రలు మానముగల ప్రాణాయామము మధ్యమమనబడును ఇది సాధకునకు కంపము గలిగించును మూడుయుద్ఘాతములతో గూడి 36 మాత్రలు మానముగల ప్రాణాయామము ముఖ్యమనబడును ఇది ప్రాణమును బ్రహ్మరంధ్రము

కడకు జేర్చును గోరక్షుడును పై మాత్రా సిద్ధాన్తము నంగికరించుచున్నాడు [14]

ఉద్ఘాతమనగా దేహమంతటను వ్యాపించిన ప్రాణముచే పీడింపబడిన అపానము పైకివెళ్ళి వెనుకకు మరలుట [15]

దేనివలన ఆనందము–నిద్రచిత్తాందోలనము–గగుర్పాటు–పరశబ్ద జ్ఞానము – శరీరాక్షేపము – కంపముగలుగుచున్నవో శ్రమ జన్యమగు చెమటను–జల్పమును–జ్ఞానమోహమును. ఏది జయించునో అది ఉత్తమ ప్రాణాయామము

ఒక చిటికవేయుటకు పట్టుకాలము మాత్రయనియు, మూడు చిటికలకాలము మాత్రయనియు, నిద్రపోవువాడు శ్వాసనుపీల్చి విడుచు కాలము మాత్రయనియు, మాత్రాలక్షణము యాజ్ఞవల్క్యస్మృతి-స్కాంధపురాణముయందు వర్ణింపబడినది [16]

12 మాత్రల ప్రాణాయామము లఘువనియు, 24 మాత్రల ప్రాణాయామము మధ్యమమనియు, 36 మాత్రల ప్రాణాయామముత్తమ మనియు, మార్కండేయపురాణమున చెప్పబడినది [17]

(సశేషము)

---

14. ప్రాణాయామస్య మానంతు మాత్రాద్వాదశకం స్మృతమ్।
నీచో ద్వాదశ మాత్రస్తు సకృదుద్ఘాత ఈరితః॥
మధ్యమస్తు ద్విరుద్ఘాతశ్చతుర్వింశతి మాత్రకః।
ముఖ్యస్తు యస్త్రిరుద్ఘాతః షట్త్రింశన్మాత్ర ఉచ్యతే॥
ప్రస్వేదకంపనోత్థానజనకశ్చ యథాక్రమమ్। హ ప్ర P 46 1 24

15 See హ ప్ర P 46 1 26

16, I bid P 46 1 27

17 లఘుర్ద్వాదశ మాత్రస్తు ద్విగుణః సతుమధ్యమః
త్రిగుణాభిశ్చ మాత్రాభిరుక్తమోఽయముదాహృతః॥ మార్కండేయ పురాణం

# శ్రీవేంకటేశ్వర స్తవము

— ** —

విద్వాన్ శ్రీ వాసా కృష్ణమూర్తి

తపమొనరింపలే నకట! తామర సేక్షణ! దుష్టవాసనా
విపులవితాన మేమియు వివేకముచే నణగింపలేను, నీ
చపలుని గావగా వెరవు సాధుజనావనా! నీకులేద, నీ
జపమొనరింప బూనితిని, సన్నుత! కావుము వేంకటేశ్వరా!

నవరసముల్ స్రవించు నలనాడెపు బల్కులు దేశమంతటన్
వ్యవహృతి జాలువార నవివావిరి గైకొని ప్రాక్కవీంద్రులన్
గవితల జెప్పి పేర్వడిరి, కావ్యము లట్లు రచింపశక్యమే?
కవితనె నిన్ భజించుటయు గమ్మని మార్గము వేంకటేశ్వరా!

కవితను నిల్చునట్లు మది గాఢతరస్థితి నా జపాదులన్
వివిధ విశిష్టపూజలను వేరుగ నిష్ఠల నా సమాధులన్
ప్రవిమల సాధుగోష్ఠులను బాటిగ నిల్వదు పద్మనేత్ర! యా
కవితనె నిన్ భజింతు గలకాలము కావుము వేంకటేశ్వరా!

జలజల జాలువాఱు సరసాంచిత కోమల పద్యమాలలన్
జలజదళాయతాక్ష! నిను జయ్యన పూజలొనర్చు పున్నెమీ
వెల వెల బాఱు సంస్కృతి సవేలగతిన్ బొడసూపదేని నా
పలపలపాఱు మానసము బట్టగజాలను వేంకటేశ్వరా!

సరస హృదంతరంబుల ప్రశస్తగతిన్ జనియించు కల్పనల్
పరమ పదార్థసంగతిని బర్వుచు నందఱ హాయిదేల్చెడిన్
విరివిగ నంబుధిన్ బొడము వెన్నెల చాయలు విశ్వమంతటన్
మురిపెముతోడ బర్వి పెనుమోదము గూర్పవె? వేంకటేశ్వరా!

సరసకథాసుధాబ్ధి, యలసాధు జనావళి దివ్యరత్న, దు
స్తరదురితాబ్ధినౌక, భవతాప భరాంబుదమాల, మంగళా
చరణ విధాన బోధన విశారద సద్గురుపీరి, నీ మహో
చరితము దాచి సారపురసంబును గ్రోలెద, వేంకటేశ్వరా!

తారకల న్గణింప దలదాల్చుట, వారిధి వారిపూరమున్
దీరున దోడగా జనుట, తెంపున నింగిని గొల్వనేగుటల్
సారసనేత్ర! నీదు గుణసంతతి నెన్నమహేశుకైన నా
సారసగర్భుకేనియు నశక్యము గాదొకో! వేంకటేశ్వరా!

పవనుడు వీచునట్లు తటివానల వారిద మీనునట్లు నా
రవియును నెండ, రేవెలుగు రాణుగ వెన్నెల గాయునట్లుగా
దివికిడు నంతరంబు నిడు తీరున నుండుచు నొప్పుచుండ, నీ
వవిరతి సత్కృపారసము నంతట నింపెదు వేంకటేశ్వరా!

జననిదె బాలుచందమును జానుగ గన్గవ గాచుచుండు, నా
యనువున నీశ! నీవ మము నాదృతి గాచెద వెల్లభంగులన్
అనిశము కావు, కావు మన నచ్యుత! నీకు చికాకు పుట్టదే
పనుపుగ సర్వసృష్టి పరిపాలన నీయది వేంకటేశ్వరా!

ఇంగితవేది వీవు ఫల మింగిత వృత్తికి నిత్తువీవ, యీ
సంగతి సర్వవేదముల సారముగాగను నెంచి, యీ భువిన్
మంగళ భావనన్ మెలగి, మంగళ కార్యములూను వారికిన్
మంగళమందిరా! జగతి మంగళమే కద! వేంకటేశ్వరా!

వేలుపులందు మిన్నవని వేడుకగొల్వగ భక్తులెల్ల నీ
మ్రోలను విన్నవించినను మోదము జెందుచు వారిబాధలన్
లీలగదీర్చు నీమహితలీలల నేగతి సంస్తుతింతు, నీ
లీలల నెన్నగా దరమె? లెక్కకు మీరును వేంకటేశ్వరా!

# స్థితప్రజ్ఞుని లక్షణములు

శ్రీ కొంపెల్ల లక్ష్మీనారాయణ

(గతసంచిక తరువాయి)

యా నిశా సర్వభూతానాం తస్యాం జాగర్తి సంయమీ
యస్యాం జాగ్రతి భూతాని సా నిశా పశ్యతో మునేః

సమస్తభూతములకు సర్వేంద్రియములు నిద్రాణములై విషయాన్వేషణలేక పడియుండు సమయమునిశ అట్టి సమయమున జితేంద్రియుడగు యోగి ఆత్మావలోకనముతో మేల్కొని యుండును సర్వభూతములకు ఇంద్రియములు సావధానములై యుండి విషయాన్వేషణ చేయు సమయము పగలు అట్టి సమయము స్థితప్రజ్ఞునకు ఆత్మావలోకనము లేనందున నిశాతుల్యము

ఆపూర్యమాణమచలప్రతిష్ఠం
సముద్రమాపః ప్రవిశన్తి యద్వత్
తద్వత్కామా యం ప్రవిశన్తి యద్వత్
స శాన్తిమాప్నోతి న కామకామీ

అనేక నదీప్రవాహములు వచ్చి కలిసినప్పటికి సముద్రము పొంగి చెలియలి కట్టను దాటక స్థిరముగనుండునట్లు భోగ్యవిషములు ప్రారబ్ధకర్మవశమున సంప్రాప్తములైనప్పటికి, ఎవడు నిర్వికారుడై యుండునో అట్టి స్థితప్రజ్ఞుడే మనశ్శాన్తిని బొందునుగాని విషయాసక్తి గలవాడు మనశ్శాంతిని బొందనేరడు

విహాయ కామాన్యస్సర్వాన్పుమాంశ్చరతి నిస్పృహః
నిర్మమో నిరహంకారః స శాన్తిమధిగచ్ఛతి
ఏషా బ్రాహ్మీ స్థితిః పార్థ నైనాం ప్రాప్య విముహ్యతి
స్థిత్వాఽస్యామన్తకాలేఽపి బ్రహ్మనిర్వాణమృచ్ఛతి

సమస్త కోర్కెలను వీడి, శరీరయాత్రా మాత్రమునను కోరిక లెక, ప్రారబ్ధకర్మవశమున సంప్రాప్తములైన విషయములయందు మమకారమును, 'నాకు విషయనివృత్తిగలిగినద'ను అహంకారమును లెనివాడై సంచరించు స్థితప్రజ్ఞుడు సంసారదుఃఖోపరమ రూపమగు శాన్తిని బొందును అనగా మనస్సు విషయద్ధ్యానమునువీడి భగవద్ధ్యానమునువీడి భగవద్ధ్యానమునందు నిలిచియుండుట బ్రాహ్మీస్థితి ఇది మరణ సమయము నందలవడినను మోక్షముగలుగును సర్వసాధారణముగ మరణ సమయమున మనోవ్యగ్రత గలుగును దానినుండి తప్పించుకొని బ్రాహ్మీస్థితిని పొందుటకు యావజ్జీవము అభ్యాసము చెయవలెను కాబట్టి సమస్తమానవులు ప్రయత్నతః విషయధ్యానమును వీడి భగవద్ధ్యానము నలవరచుకొందురని యాశింపబడినది

ఓం తత్సత్

---

## భక్తులకు విజ్ఞప్తి

తిరుమల తిరుపతి దేవస్థానముల సమాచారకేంద్రము ఫిబ్రవరి 17వ తేది నుండి నల్గొండలో, "శ్రీ సీతారామచంద్ర స్వామివారి ఆలయ ఆవరణ"లో నిర్వహించ బడుచున్నది

యాత్రికులకు దేవస్థానముల సమాచార మందించుటతోబాటు ఇక్కడ, దేవస్థానముల త్రివర్ణచిత్రములు, దేవస్థాన మాసపత్రిక లభించును

భక్తులెల్లరు ఈ కేంద్రసేవల నుపయోగించుకొనవలసినదిగా విజ్ఞప్తి

తిరుమల–తిరుపతి దేవస్థానములు

# పండరీభాగవతము

శ్రీమాన్ పుట్టపర్తి నారాయణాచార్యులు

## గోరాకుంభారుకథ

(గతసంచిక తరువాయి)

పోయిన పాపండు పూబోణి! వచ్చె
నే! యెంత బనివిన నీయాత్మశాంతి
జెదురుటయేగాక - శ్రీకాంతభజన
మధురరసంబున మఱువకీ తనువు
నదె సత్యమైనట్టి యనుభవమందుఁ
గదలింప నీపాడు కష్టముల్మనసు
నన్నంబు దినకేమి హారమె నాకబల!
యన్నగధరు చింతనామృతపాన
తుందిలోదరుఁడౌచుఁ దోచకన్యంబు
మందుడఁబోలె నీమాడ్కి నుండితిని.
పదపొద! మేట్టికీ భ్రమ" యంచు నుడువ
మదిరాక్షి తనువు సమ్మద దంతురితము
నయ్యె - ధవుండు దానమ్మొనరింప
నయ్యువిదయె జల మంది యిచ్చినది
జలమంది కొనియెడి సమయంబునందు
జలజాక్షి దాకండు, శరుఁడు మగండు
కడుపునిండుగ భర్త గుడిచినయంతఁ
బడతుల మిన్నకుఁడుపు నిండినది
తాను భుజించి నట్లే నెనరెంతొ
వానిపై, చేతిపైఁ బడినవినీరు
మరల సమాధి నిర్మగ్నుఁడైనాఁడు
కరమరుదగు కుంభకారభక్తుండు
ఓరగంటను జూచె నువిద - సంసార
భార మేమియును గాఁబట్టని వాని
దనవైపు నింత జూడనివాని - భార్య

యనుమాటయే మఱచిన వాని - తనకు
నైన వారెవరు లేరనునట్లే - రంగఁ
డేనిఖిలంబని యెంచినవాని
దనమగఁడేగాడో! తలఁపు మారినదా!
వనితకు నీ క్రొత్త వర్తనమేమి
దెలియనేలేదు - నంచులనావరించి
తళతళ మెఱసె నేత్రములఁగన్నీరు
బిలచిరింతటిలోన నెలుఁగెత్తియెవరో
యలికోకి - చనులఁ జిక్కులిగింపఁ వాడమి
బరువెత్తె బయటికిఁ బషండుగాడు
పరభృతమ్మది తీపిపాటపాడినపె
ఆ పాట యెదగ్రుచ్చుకొనటులైన - బహుళ
తాపంబుతోడ వాత్యాకంపితంబు
లతికయువోలె వల్లాడగాఁ దనువు
సతినేలపైఁబడెఁ జాపకట్టుగను
గమనింపనేలేదు గాంతుండు దీని
గమలాక్షి యింతలోఁ గన్నులు దెఱచి—
తనపాటు నారసి జూచిన భర్తృదైవ
మనుమించ సేసెద రనువయంబునను
సరగునలేచి సుందరిలోని కరిగె
పరమపాతివ్రత్య భావైకజీవ!
బోనంబు జక్కుల బోనమై దీన
దీనయై విలపించె తెఱవ యీ రీతి
మఱచి పోయిన యాస కెఱలించిచూపి
పరభృతమా! యెంతపని చేసినావె
కూయకే కోయిలా! కూయుబోకమ్మ
తీయతేనియ బరువు మోయలేదమ్మ
హృదయమ్ము నీ పుణ్యమే! కలవోలె
బ్రతుకులో విస్మృతి పాపని గొంతు
తలఁపులు తెదికింప వలదె! నీ యాన

సలిపి కొందును నమస్కారమ్ము నీకు
పాడవే యొక క్రొత్తపాట యీ దుఃఖ
పీడిత హృదినెల్ల - వెన్నెలఱెక్క
లను విప్పికొని యప్పికొన నవస్మృతులు
వనవిభూషణమ ! నా తనయుఁడులేఁడు
యెవ్వరిఁజూచి నీ వింటిపై నిలిచి
మవ్వంపుఁ బాటఁ బ్రేమమున బాడెదవు
కసిగందులేఁడు నిక్కంబుగా వాఁడు
వసియించు నందన వనములో నేఁడు
తావి పూవుల వెల్లఁ దరలిపోయినది
యీ వెన్నెల గుంపులన్ని చేరినవి
సెల కన్నెలందరు - చేగికొన్నారు
మలయసమీరంబు నిలువకేగినది
చిలిరుటాకులును సంతస కట్టైనెపుడో
జిలుగు సంజకాంతి యిలవీడియేగె
జలదేవతలు వెంటఁ జామరల్వీవ
వలసబోయిరిలేరు వనదేవతలును
గాదు వీక్షించు భాగ్యము నోచికొన్న
నందనా రామమ్మనకు - దరాదేవి
కేమి దక్కినదింక - యెల్లచెల్వంబు
నామ మతారూపి నాచికొన్నాఁడు
మీ కులపెద్దలు - మేదినిఁగలుగు
గోకిల లెల్లరుఁ గూడికొన్నారు
తెలియలేదో నీకుఁ దెలివి మాసినదా !
యిలనెందు కున్నావె ! యింకను బికమ ·
బుడుతఁడు లేఁడు పో ! పో ! వానిగోలు
పడి - నిరంతర దుఃఖభారంబునకును
దక్కవిల్చినయట్టి తల్లిశవమ్ము
దక్కస్మశాన మౌధారుణి యందుఁ
బడమటి సంద్రాన బడియె సూర్యుండు

బడతి దుఃఖముచూడ భరమైనవోలె!
జూచె, దృష్టులువిప్పి శూన్యదృక్కులను
నాచపలాక్షి గాఢాంధకారంబు
గవిసికొన్నది యెల్ల కడలనాత్మీయ
మవు దుఃఖమే భువి నలముకొన్నట్లు
కుటిలోన చిమ్మచీకటి - యంతలేచి
కుటిలకుంతల యొకగ్రుడ్డి దీపమ్ము
వెలిగించె - మెఱసె చక్షులలోననీరు
చిలిపిపాపని మోము తలఁపునఁదోచి
తలమల్చి వీక్షించె ధవువైపు మగువ
మలఁచి నిల్పిన యట్టి ప్రాణిబొమ్మతఁడు
నా పాపఁ డింటిలోనడయాడుచున్న
నీ వగిదిని భర్త నేకాంతమందు
గనుగవమూసె కూర్చొననిచ్చునేమి
దనయుండులేని కతమ్మున నిల్లె
పాడువడ్డదటంచుఁ బడతి నిట్టూర్చె
వేడిగా - వగతోడ వేదుఱు గొనుచు
నాపతి దైవంబ! సాపడవత్తు
వా! పాండురంగని నంపరా! యింక
మన పాండురంగండు మఱగెను - నాడె
యనినది యర్ధోక్తి నశ్లె ప్రమింగినది
కనులు విప్పె ధవుండు - గామిని యన్న
మును బెట్ట నఱతిండిదిని మూసె దృష్టి
తలె దొల్చె తరుణి హృదయములోఁదోచె
దలెదొల్చు నప్పుడు - దన కొంగు పట్టి
బుడి బుడి యేడ్పులు ముద్దులు గురియ
నడుగుల ద్రొక్కుటో నందెలు బలుక
నత్తనయుఁడు వెంటనంటిహరాన
నెత్తుకొమ్మని చేతు లెత్తువాలకము
కలికింకేమి యాకలి దోచనేదు (సశేషము)

# భక్తవిజయము

మన దేశములో చాలా దేవాలయములు కలవు దేవాలయములలో నిత్యార్చనలు ధూపదీపనైవేద్యములు ఇతర విశేష పూజలు జరుపు వారిని పూజారులనియు, లేదా అర్చకులనియు వ్యవహరింతురు వారుచేయు పనినిబట్టి వారు భగవంతునకు అతి సన్నిహితులు, సంఘమునకు గౌరవపాత్రులు కొన్ని దేవాలయములలో దివ్యతేజస్సు ఆకర్షణశక్తి అచ్చటి మూర్తిని బట్టియు యంత్రమును బట్టియు మాత్రమేగాక అచ్చటి అర్చకుల శ్రద్ధాభక్తులనుబట్టి కూడా యుండును ఆస్వామివారి అలంకరణ మొదలగు కొన్ని విషయములుకూడా భక్తుల నాకర్షించును ఇట్లు భక్తులు ఎక్కువగా వచ్చిన కొలది వారు నిశ్చల భక్తితోను ఏకాగ్రతతోను ఆ దేవాలయములో ప్రార్థనలు చేయుటవలన కూడా ఆస్థలముయొక్క మహాత్మ్యము ప్రాశస్త్యము తప్పక పెరుగును కావున ప్రతి దేవాలయమునకు అచ్చటి అర్చకుల భక్తిశ్రద్ధలు చాల అవసరము కొందరు అర్చకులు కేవలము అర్చనలతోను పూజలతోను అలంకరణతోను తృప్తిచెందక భగవద్దర్శనము కొరకు తీవ్ర తపస్సు చేయుదురు ఈచర్మచక్షువులకు అసాధ్యమైన దివ్యదర్శనమును గొప్ప సాధనతో అనుభూతిని పొందిన అర్చక శ్రేష్టుడు శ్రీ రామకృష్ణ పరమహంస నవసమాజములో హిందూ మతోద్ధారకుడు ఆతడు కలకత్తా నగరమునకు సమీపమునగల దక్షిణేశ్వరములోని కాళికాలయమునందలి పుజారి తల్లిదండ్రులు చిన్నతనమునందే బలవంతముగా వివాహము చేసిరి వారి ధర్మపత్ని పేరు శ్రీ శారదాదేవి శ్రీ రామకృష్ణ పరమహంస భార్యనుగూడ తల్లిగా భావించి పూజించిరి అనేక సాధనలుచేసి అన్ని మతములు పరిశోధించి మొదట జగన్మాతయొక్కయు తదుపరి పరమేశ్వరుని ఆదివ్యమంగళ విగ్రహములు ఈ శరీరముతోనే చూడకలిగిన మహాభాగ్యశాలి భగవద్దర్శన మహాద్భాగ్యమును పొందిన మహనీయులెందరో కలరు కాని

శ్రీ రామకృష్ణ పరమహంస అట్టివారివలె కేవలము ఆత్మ సాక్షాత్కారముతో సంతృప్తి చెందక పండితపామర జనులందరకు ఎట్టిమతవిభేధములుగాని సంకోచములుగాని లేక ఆత్మ సాక్షాత్కారము సులభపద్ధతిం పొందవలెనను మహదాశయముతో అనేక సద్బోధలు చేసిరి వివేకానందుని వంటిసన్యాసచక్రవర్తిని ఉపన్యాసకేసరిని శిష్యునిగా తీర్చిదిద్ది మొట్టమొదటిసారిగ హిందూమత ప్రభావము పాశ్చాత్యదేశములలో అంతర్జాతీయ సభలలో వ్యాపింపచేసిరి వేదముల, శాస్త్రముల, ఉపనిషత్తుల, భగవద్గీతల సమస్త సారాంశము వారి మృధుమధుర బోధలలో కాననగును అసలు హిందూమత స్వరూప స్వభావము లెట్టివో తెలిసికొనవలెనన్న శ్రీ రామకృష్ణ బోధామృతము చదివిన చాలును భక్తశ్రేష్టుడు శ్రీ రామకృష్ణ పరమహంస

సువర్ణ

---

# తిరుమల యాత్రికులకు విజ్ఞప్తి

ఇందుమూలముగా యాత్రికులకు తెలియజేయడమేమనగా, నడకమూలముగా దేవాలయమునకువచ్చు యాత్రికుల సౌకర్యార్థమై 22-2-1970 నుండి తిరుమల శ్రీ వేంకటేశ్వర స్వామి ఆలయము చుట్టు ఉన్న 'నాలుగు మాడ వీధు'లలో కార్లు వెళ్ళుట నిషేధించడమయినది దయచేసి కార్లలో వచ్చు యాత్రికులందరు ఈ విషయములో సహకరించ ప్రార్థన

యం చంద్రమౌళిరెడ్డి
ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు

# వేంకటేశ్వరా!

—✳✳✳✳—

శ్రీ ప్రయాగ సత్యనారాయణ శాస్త్రి

నమ్మితి నీదు పాదముల నమ్మితి నీదగు నబ్జహస్తమున్
నమ్మితి నీదు నామ మెదనమ్మితి నీదగు భక్తకోటినిన్
నమ్మితి శంఖమున్ మఱియు నమ్మితి చక్రము నెమ్మనమ్మునన్
నమ్మితి నిన్నె సర్వమని నన్నిట కావుము వేంకటేశ్వరా!

ఎలుగెత్తి పిలువగా కరిని కాపాడంగ
సిరితోడ జెప్పక చేరలేదె?
నీ నామ మననమే నీమంబుగాగల
ప్రహ్లాదుకాపాడ బూనలేదె?
నీ పాదపద్మముల్ నిత్యంబు చింతింప
ధృవునకు సత్థాన మీయలేదె?
భక్తితో నెంగిలి ఫలముల తినిపింప
శబరిని కరుణించి స్వర్గమీవె?

నిన్ను నమ్మిన వారికి నున్న భయము
ఆర్తరక్షక బిరుదాంక యనఘ చరిత!
పంకజానన పద్మాక్షు పాహి పాహి
సంకటములను బాపుమా వేంకటేశ!

శ్రీకర ఫణినగధామా!
ప్రాకటముగ భక్తకుముద పాలిట సోమా!
నాకాధిపనుత నామా!
భీకర రాక్షసవిరామ! భండనభీమా!

# తిరుచానూరు-కృష్ణాలయం

శ్రీ ముట్నూరి సంగమేశం

తిరుమల తిరుపతి మతచరిత్రలో తిరుచానూరు మొదటినుండి చాల ప్రధానమైన పాత్రవహిస్తూ వచ్చిన గ్రామం ఇది పల్లవులనాడు కుడవూరు నాడులో తిరువేంగడకోట్టానికి చెందిన గ్రామంగాను, చోళులనాడు రాజేంద్రచోళ మండలం (జయంగొండచోళ మండలం)లో గ్రామంగాను శాసనాలలో నామోదై కనిపిస్తుంది దీనికి తిరుచానూరు చిరుతానూరు అనేవి యీనాటి పేర్లు తిరుచ్చుకనూరు, తిరుజ్జోగినూరు, శ్రీశుకగ్రామం, వాది రాజపురం అనేవి శాసనాలలో కనిపిస్తూన్న మునుపటి పేర్లు

తిరుమల తిరుపతి దేవస్థానపు శాసనాలలో మొట్టమొదటి కాలపు శాసనాలన్నీ తిరుచానూరులో దొరికినవే మొదట తిరుమల శ్రీ వేంకటేశ్వరాలయానికి ధర్మకర్తలుకూడ తిరుచానూరు సభైయారు (పంచాయతి దారు)లే అని అనేక శాసనాలవల్ల తెలుస్తూంది క్రీస్తుశకం 8-9 శతాబ్దాలనాటికే యీ గ్రామం ప్రసిద్ధమైన వైష్ణవ క్షేత్రంగా, వైష్ణవధర్మ ప్రచారకేంద్రంగా ఉంటూ, ఏటా వేలాది యాత్రికులను ఆకర్షిస్తూన్నట్లు అప్పటి వ్రాతలవల్ల స్పష్టపడుతూంది దుర్గమారణ్య భూయిష్టమైన తిరుమలకొండ మీదికి పోయి రాలేని అశక్తులైన యాత్రికులు తిరుచానూరులోనే, అక్కడ వెలసిన శ్రీ వేంకటేశ్వర ప్రతినిధిమూర్తి సన్నిధిలోనే దర్శనాలు మ్రొక్కుబడులు చెల్లించి యాత్రముగించుకొనేవారనిపిస్తుంది ఆ రోజులలో అక్కడ ఒక తిరుమంత్రాలయం, తిరువలన్ కోయిల్, అనే ఆలయాలు వెలశాయి తిరువెంకటత్తు పెరుమాన్ అడిగళ్ అనేపేరున వేంకటేశ్వరుని ప్రత్యామ్నాయమూర్తి ఒకటి అక్కడ ఉండేది మంత్రాలయం లేదా తిరుమంత్రశాలలో మరో వేంకటేశ్వరమూర్తి

ఉండేది శ్రీ వైష్ణవదీక్ష పుచ్చుకొనేవారికి యీ మంత్రాలయంలో దైవసన్నిధిని మంత్రోపదేశాదులు జరిగేవి

తిరువలన్ కోయిల్ గురించి లభిస్తూన్న ముప్పై పైచిలుకు శాసనాలలో కేవలం పదిమాత్రమే తారీఖులతో ఉన్నవి వీటినను సరించి క్రీ శ 826 నుండి 1221 వరకు యీ ఆలయం వైభవోపేతంగా వెలసియున్నట్లు తెలుస్తుంది ఆ తరువాత దీని ప్రశంస వినపడదు ఈ శాసనాలన్నీ వాహనమండపంలోనో పడికావలి గోపురంలోనో దొరుకుతూన్నందున ప్రస్తుతం శ్రీ పద్మావతీ ఆలయమున్న ఆవరణలోనే మునుపటి తిరువిలన్ కోయిల్ ఉండేదని, కాలాంతరాన అది జీర్ణించి పోయి, ఇప్పటి ఆలయాలు ఆచోట వెలశాయని ఊహించవచ్చు

శ్రీ పద్మావతీ ఆలయప్రాంగణంలో ఇప్పుడున్నవి మూడు దేవాలయాలు వీనిలో గోపురానికి ఎదురుగా ఉన్న ఆలయం కృష్ణాలయం, దానికి కుడిప్రక్క వరదరాజు (సుందరరాజు) పెరుమాళ్ ఆలయం, ఎడమప్రక్క పద్మావతీ ఆలయం వరుసగా వెలశాయి గోపురానికి ఎదురుగానున్న కృష్ణాలయమే యీ మూడింటిలోనూ ప్రాచీనమనిపిస్తుంది క్రీ శ 1221-1552 మధ్యగల సుమారు పన్నెండు శాసనాలలో ఈ ఆలయాన్ని గూర్చి వినిపిస్తుంది ఆ రోజులలో ఈ ఆలయం తిరువీధి, బ్రహ్మోత్సవం పారువేటవంటి ఉత్సవాలన్నీ జరుపుకొనేది తిరుమల శ్రీ వేంకటేశ్వరాలయం నుండి దీనికి ప్రత్యేకమైన రాబడి కానుకలుండేవి ఈ ఆలయం పేరు వినిపించిన దిలగాయతు మునుపటి తిరువిలన్ కోయిల్ గాని అచ్చటి మూర్తులుగాని ఏ శాసనంలోనూ ప్రస్తావించబడినట్లు కనబడదు మొదట యాదవరాజులనాడు తరువాత సాళువ నరసింహరాయల కాలంలోను, తదుపరి అచ్యుత రాయల కాలంలోను కృష్ణాలయం (అలిగి యప్పెరుమాళ్ కోయిల్) క్రమాభివృద్ధిపొందుచూ వచ్చినట్లు ఆ తరువాత దీని ప్రాభవం కొంత తగ్గినట్లు కనిపిస్తుంది

కృష్ణాలయం తిరుచానూరులోని ఆలయాలలో చాలచిన్నది గర్భాలయం, అంతరాళం, స్నపనమండపం ముఖమండపం కలిగి ఈ ఆలయం ద్వితలవిమానంతో చిన్నదైన ఇమిడికగా కట్టినట్లుంటుంది విమానంమీద కలశం మూలలందు సింహామూర్తులు శోభాయమానంగా కనిపిస్తాయి ముఖమండపంలో రెండు చివరలా నిలిపిన రెండు స్తంభాలు చోళశిల్ప శైలికి, తక్కిన స్తంభాలన్నీ విజయనగరశైలికి సంబంధించినట్లు రూపిస్తాయి బహుశా యీ మండపం విజయనగర రాజుల కాలంలో కట్టబడినది కావచ్చు అలా కట్టుతూన్నప్పుడు మునుపటి తిరువిలన్ కోయిల్ వంటి ఏ ఆలయానిలో కొన్ని పరికరాలు దీని నిర్మాణంలో వినియోగించి యుండవచ్చు ఈ లక్షణం తిరుచానూరులోని ఆలయాలన్నిటికీ వర్తిస్తుంది

కృష్ణాలయపు గర్భాలయంలో తూర్పు ముఖంగా పద్మాసనాశీనుడైన శ్రీ కృష్ణునిమూర్తి ప్రతిష్ఠించ బడింది, ఇది ద్విభుజమూర్తి రెండు చేతులూ తొడలమీద నానుకొని వరదముద్రలతో ఉన్నాయి ఈ విగ్రహానికి కుడిప్రక్క ఉత్తరముఖంగా బలరాముని విగ్రహం ప్రతిష్ఠించబడింది బలరాముడు కుడికాలు నేలకు వ్రేలవేసి, ఎడమ కాలు మడిచి ఎత్తి ఆమునుకుపై ఎడమచేయిసాచి, కుడిచేయి నేల నానుకొని, తమ్ముడు చెప్పేదేదో శ్రద్ధగా వింటూన్నట్లు మలిచిన మూర్తి ఈ విధంగా కృష్ణ బలరాము లిద్దరినీ, యీలాటి మంత్రాలోచన భంగిమలో మలిచి ప్రతిష్ఠించిన ఆలయం మరోచోట ప్రాయః లేదేమో అనిపిస్తుంది ఇది చాల అరుదైన శిల్పప్రతిష్ఠ

ఆలయానికి ధ్వజస్తంభాదులు కాదు, సరిగదా ఉత్సవవిగ్రహాలు కూడ ఉన్నట్లులేదు కాళీయ మర్దన భంగిమలో ఉన్న కృష్ణ విగ్రహమొకటి, లక్ష్మీనృసింహమూర్తి ఒకటి యీ గర్భాలయంలో నిల్చిన ఉత్సవమూర్తులు ఇదికూడ యీ ఆలయానికి గల విశిష్టతలలో ఒకటి అని చెప్పుకోవచ్చు

---

# కాశ్యప జ్ఞానకాండః

శ్రీమాన్ ఆర్ పార్థసారథి అయ్యంగార్

(గత సంచిక తరువాయి)

తాభ్యాం యద్వర్తితం సంసారచక్రం, చక్రమ్ యత్సర్వలోక సారం సర్వప్రాణిహృదిస్థితం హంసాఖ్యం చేతోరూపంతచ్ఛంఖమ్, యః పృథివ్యాది పంచాత్మా సర్వదేవమయః ఛందః పక్షః సర్వగః సర్వభూతాత్మా అనాదినిధనః స సుపర్ణో గరుత్మాన్, పృథివీవాయు సంయోగాచ్చాపః శార్ఙ్గమ్, తేజోవాయుమయో బాణః, విద్యావిద్యే ఇషుధి, లోకాలోకాద్రిః ఖేటకః, కృతాన్తో నన్దకః, దేహాన్తరాత్మా సర్వేషాం దండో దండః, ధ్వజః అపరాజితాధారః, భేరీశబ్దాత్మకః లోకసన్తానభిత్తిః నాగః అశ్వః వాయు సమవాయ ఇతి శ్రుతయో గృణన్తి, తస్మా దేవైస్సహైవ ఉభయత్రవిహితే దేహామర్చయేత్

అను ఆ ప్రకృతి పురుషులు ఉభయులచే ప్రవర్తింపచేయబడు సంసార చక్రము భగవానుడు హస్తమందు ధరించిన చక్రము, సర్వలోకముల సారమును సర్వప్రాణుల హృదయమందు 'హంస' శబ్దవాచ్యమై చేతో రూపముగ వ్యవహరింపబడునది శంఖము యెవ్వడు పృథివ్యాది పంచభూతాత్మకుడో అతడు సర్వదేవమయుడును సర్వగుడును ఛందస్సులను పక్షములుగా గలవాడును సర్వభూతాత్మకుడును అనాది నిధనుడును సువర్ణుడునగు గరుత్మంతుడు. పృథివీ వాయుమహా భూతసంయోగమే శార్ఙ్గమను వ్యవహారముగల బాణము, తేజో వాయుమయము బాణము, విద్యయు అవిద్యయు ననునవి తూణీరము లోకాలోక పర్వతమె ఖేటకము, కృతాన్తుడు నందకము, సర్వభూతాన్తరాత్మయే దండము, అపరాజితాధార సత్తయను నది ధ్వజము శబ్దమయము భేరి, లోక ప్రవృత్తి నిదానమె నాగము వాయు సమ వాయమశ్వము అని శ్రుతులు చెప్పుచున్నవి కావున అన్నివిధముల దేవాలయమునందు భగవద్విగ్రహమును అర్చనచేయు పద్ధతిలో యీపైన చెప్పబడిన అందరు పరివార దేవతలతో చేర్చియె భగవానుని ప్రతిష్ఠించి అర్చనము చేయదగునని శ్రుతులు చెప్పుచున్నవి

ప్రకృతి పురుషులు, శ్రీభూసహిత శ్రీమహావిష్ణుని విగ్రహములు ఇరువురును కలసి ఒకే అవిభక్త పదార్థము= 'దైవతం దంపతీనః' అని పెద్దల అనుసంధానము (దీని సార మీక్రింది విధముగ తెలియదగును)

(1) చక్రము - భగవానుని దక్షిణహస్తమందలి ఆయుధ విశేషము, సుదర్శనాపరవ్యవహారము కలది అనాదియు సాంతమునగు సంసార స్మారకము

(2) శంఖము - భగవానుని వామహస్త మందలి ఆయుధ విశేషము పాంచజన్యము 'సోఽహం' అనుభవమునకు మూలమైన జ్ఞానమునకు స్మారకము

(3) గరుత్మంతుడు - సర్వభూత హితమగు వేదరాశికి స్మారకము
(4) శార్ఙ్గము - పృధివీ వాయుసంయోగ శక్తి కార్యస్మారకము
(5) బాణము - తేజోవాయు సంయోగశక్తి కార్య స్మారకము
(6) తూణీరము - (అంబులపొది) విద్యా విద్యాస్మారకము
(7) ఖేటకము - (బాణవిశేషము) లోకాలోక పర్వతస్మారకము
(8) నందకము - (బాణవిశేషము) యమధర్మరాజు స్మారకము
(9) నాగము - (అనునస్తుడు) లోకప్రవృత్తి స్మారకము
(10) అశ్వము - (వాహనము) వాయు సమవాయము

ఒక లౌకిక ప్రభువును తన పరివారముతో చేర్చి ప్రజలు పరిచర్య చేయుటను అఖిలాండకోటి బ్రహ్మాండ నాయకుని నాహ్వానించి సమూర్తునిగ నాలయములలో ప్రతిష్ఠించి ఆరాధించునప్పుడు ఆరాధనమందలి అంతరార్థము నిట్లు తెలిసికొని ఆరాధింపవలయునని పై వివరములు ఆయా ఆయుధముల యొక్కయు పరివారములయొక్కయు స్మారక స్వరూపములను తెలియచేయుటను తెలియదగినది అనుక్తములగు నితర సందర్భములకీ గణనమును సలక్షణముగా తీసికొని యితరత్ర సమన్వయపరచి కొనునది

ముముక్షుర్ద్విజనే దేవేశం శంఖచక్రధరమేవ అన్యత్రాలయే పంచబేర సమాయుక్తం గర్భాగారే స్థాపయేత్ దేవీభ్యాం మృషిభ్యాం భృగు పుణ్యాభ్యాం వా అర్చితం నిధీశేన్ద్రాభ్యాం నాగేన్ద్రాభ్యాం

వా మయా పీఠేన యుక్తం వా సూర్యచంద్రాభ్యాం ఖ్యాతీశ పద్మా పితృభ్యాం వా భృగు ద్రుహిణాభ్యామర్చితం వా సంకర్షణ ప్రద్యుమ్నా నిరుద్ధ సాంబైః పద్మయా వాసుదేవ మేవంస్థిత మాసీనం వా అన్యత మేన సంస్థాప్య గ్రామ నగరాదినామృద్ధ్యై పూజయేత్ నాన్యదైత దితి విజ్ఞాయతె

ఇతి శ్రీ వైఖానసే భగవచ్ఛాస్త్రే కశ్యపప్రోక్తే జ్ఞానకాండే భావనా కల్పో నామ పంచత్రింశోఽధ్యాయః

అను॥ కేవలము మోక్షేచ్ఛగల భక్తుడు భగవానుని విగ్రహమును శంఖ చక్రములను రెండాయుధములతో కూడినట్లుగనే ఆలయమందు ప్రతిష్ఠించ వలయును తక్కిన త్రివర్గ కాములగువారలు భగవానుని పంచమూర్తి విధాన ముగ అనగా ధ్రువ కౌతుక స్నపనౌవ బలిబేరములతో స్థాపించవలయును (ముముక్షువునైతము ధ్రువమూర్తిని గర్భాగారమందు ద్విహస్తములతో శంఖ చక్రములతో ప్రతిష్ఠించినను పంచమూర్త విధానముచే ఆచరించవలయును అనుట తెలిసికొనదగును) ఈ యర్చనమందు కొన్ని వికల్పములు వ్యవహరింప బడు చున్నవి గ్రామ నగరాద్యభివృద్ధికై యీ దిగువురీతిని ఆరాధించునది

(1) దేవేరులు - అర్చకావస్థలోనున్న భృగు మార్కండేయుల నను నిరువురు మహర్షులు

(2) దేవేరులు - అర్చకావస్థలోనున్న నిధీశుడు ఇంద్రుడు నను నిరువురు దేవతలు

(3) దేవేరులు - అర్చకావస్థలోనున్న భూదేవి గరుత్మంతుడును అనుపాయులు

(4) దేవేరులు - అర్చకావస్థలోనున్న సూర్యచంద్రులను దేవతలు

(5) దేవేరులు - అర్చకావస్థలోనున్న ఖ్యాతీశ భృగుమహర్షులు

(6) దేవేరులు - అర్చకావస్థలోనున్న భృగు ద్రుహిణ ఋషులు ఈ విధానముగా గాని

మహాలక్ష్మితోను సంకర్షణ, ప్రద్యుమ్నా నిరుద్ధ సాంబులను దేవతలతో చేరిన మానుష వాసుదేవ మూర్తిని పంచవీర విధానోక్తముగగాని గర్భాగార

మందు స్థితములేక ఆసినము అను (కూర్చొనియుండుట, నిలుచుని యుండుట) అను రెండు ప్రకారములలో యేయొక ప్రకారముగగాని ఆలయములో ప్రతిష్ఠించి ఆరాధించవలయును మరియొకవిధముగా చేయరాదు అని ప్రమాణములు చెప్పుచున్నవి

ఇది ముప్పదియైదవ అధ్యాయము

---

## అథషట్త్రింశోఽధ్యాయః

పంచమూర్తి విధానేన గ్రామమధ్యేవా ప్రాచ్యాం స్థానకం శయనవా, దక్షిణ పశ్చిమయోః ఆసీనం స్థానకం వా ఉత్తరే శయా నమాసీనంవా ఆగ్నేయేస్థానకం నైరృతే వారాహిం వాయవ్యే నారసింహం ఐశాన్యే హరిశాంకరం విజనే యోగాసనం నద్యుద్యాన సముద్రపార్శ్వే శయానం రాష్ట్రాన్తర్ నదీసంగమే స్థానకం శయనంవా అన్యత్ర సుఖాసనమేవ సంస్థాపయేత్

పంచమూర్తి విధానముగ గ్రామమధ్యమందుగాని ప్రాగ్దిశయందుగాని స్థానకమూర్తినిగాని శయనమూర్తినిగాని చేయవలయును గ్రామదక్షిణ పశ్చిమ దిశలందు ఆసీనునిగగాని స్థానికునిగనుగాని చేయవలయును అట్లే ఉత్తరదిశ యందు శయనునిగగాని ఆసీనునిగగాని చేయవలయును అట్లేవిదిక్కులకు సంబంధించినంతవరకు ఆగ్నేయమందు స్థానకుని నైరృతిమూలను వరాహుని వాయువ్యమందు నారసింహుని ఈశాన్యమందు హరిశాకరమూర్తిని చేయునది జనసంచారములేని స్థలములందు యోగాసనమూర్తిని నద్యుద్యానసము ద్రపార్శ్వాది ప్రదేశములందు శయనమూర్తిని రాష్ట్రాంతరము నదీసంగమ ప్రదేశములందు స్థానకునిలేక శయనుని ప్రతిష్ఠించునది తక్కిన ప్రదేశములందు సుఖాసీనమూర్తినే ప్రతిష్ఠించవలయును

(సశేషము)

# శ్రీ రామాయణ రహస్య రత్నావళి

శ్రీమాన్ వంగీపురం రంగస్వామయ్యంగారు

(గతసంచిక తరువాయి)

## హనుమంతుఁడు వరమడుగుట

హనుమంతుఁడు సీతను బెదరించి కఠినోక్తులాడి చీకాకుపెట్టిన రాక్షస స్త్రీలను బహువిధముల హింసించి చంపఁగోరినపుడు సీతాదేవి యతనితోఁ జెప్పిన యుత్తరము గమనింపఁ దగినది ఒకరు మనలను బాధించినందున వారు మన శత్రువులనుటయుఁ దగదు వారు స్వతంత్రించి యట్లు చేయు చున్నారా? లేక ఇతరుల నిర్బంధమువలన నట్లు చేయుచున్నారాయని తెలిసి కొనవలెను దుష్టుడగు యజమానునివద్దనుండు సేవకులాతని యాజ్ఞచే నితరుల బాధించిన నా తప్పు యజమానునదేయని గ్రహింపవలెను హత్యగావించిన వానికి ఉరిశిక్ష విధింతురు అప్పుడా ఉరితీయువాఁడు విరోధముచే నేరస్థుని యురిదీయుట లేదు ఆతఁడాపని కొప్పుకొని జీవించుటచే నితరుల నురితీయు చున్నాఁడేగాని తనకు వారు శత్రువులని కాదుగదా అట్లే రావణుని కొలువులోని రాక్షసస్త్రీల క్రూరచేష్టితములని సీతాదేవి వారిపట్ల దయతలఁచి హనుమంతుని వారించి వారి ప్రాణములను గాపాడెను ఇట్టి సీతాదేవియొక్క అద్వితీయ కారుణ్య మెఱిఁగి త్రిజటరాక్షస స్త్రీలకుఁ దన స్వప్నమును వివరించి రాముని వలన రాక్షసస్త్రీలకు రానున్న ఆపదను బోఁగొట్టుకొనుటకు 'అలమేషా పరిత్రాతుం రాఘవాద్రాక్షసీ గణమ్' సీతాదేవియే చాలుననెను ఒకపరి తన్నడిగిన వారినే రామచంద్రుఁడు రక్షించును సీతాదేవి తన్నడుగకున్నను దీసులు క్రూరులై తన్ను బాధించియుండినను వారిని హనుమంతునివద్దనుండి కాపాడుటచే "సీతాయాశ్చరితం మహత్" ఆ సీతయొక్క చరిత్రము గొప్పదని వెల్లడియగు చున్నది

తన్నాశ్రయించి తనతో స్నేహము పాటించువాఁడెట్టి దుష్కృత్యము చేసియున్నను నతనిఁ గాపాడెదనని శపథము చేసినాఁడు రామచంద్రుఁడు అందుకు లుబ్ధ కపోతోపాఖ్యానము నెత్తిచెప్పెను అట్లే అపకారము చేసినవధార్హులుగ నుండినను వారిని సంరక్షించుట ఆర్యుల లక్షణమని సీత హనుమంతునకు భల్లూక వ్యాఘ్ర సంవాదము నెత్తిచెప్పెను [పూర్వమొక మనుష్యుని పులితఱుమగా నతఁ డొక చెట్టెక్కెను అందొక భల్లూక ముండినది పులి ఎలుఁగునుచూచి 'మన

శత్రువగు వీనిని త్రోసివేయుము' అనెను అప్పుడా ఎలుఁగుబంటి వ్యాఘ్రముతో 'నేనుండుస్థలమునకు వచ్చిన వాడెట్టివాఁడైనను నేను వానిని రక్షింతును' అనెను అదినిద్రించెను అప్పుడాపులి వానితో 'ఎలుఁగుంటిని త్రోసివేయుము నిన్ను జంపను' అనెను వాఁడట్లే ఫల్లూకమును బడఁద్రోసెను కానియభ్యాసముచే నదియొక కొమ్మను బట్టుకొనెను అంత నాపులి దానితోఁ 'చూచితివా ఈ నీచుని నీకుఁ గీడు చేసినవానిఁ బడఁద్రోయుము' అనెను అప్పుడది పులితో 'వాఁడేమి యపకారము చేసినను బలుమారట్లు చేసినను వానికెగ్గు చేయను' అనెను ఇందువలన నపకారికిని ఉపకారమేచేయుట ధర్మమని సీతాదేవి బోధించి నట్లగుచున్నది ]

## సీతా రామ సమాగమము

హనుమంతునిమాట వినినంతనె రాముఁడు విభీషణునిఁ జూచి

దివ్యాంగరాగాం వైదేహీం దివ్యాభరణ భూషితామ్ ।
ఇహ సీతాం శిరస్స్నాతాముపస్థాపయ మాచిరమ్ ॥

'నీవు సీతకు మంగళస్నానము చేయించి దివ్యవస్త్రాభరణములతో నలంకరింపఁజేసి మేలగు మైపూఁతల నలందఁజేసి శీఘ్రమునఁ దోడ్కొనిరమ్ము' అని యాజ్ఞాపించెను అంత విభీషణుఁడు తన స్త్రీల మూలమున సీతాదేవికా వార్త యెఱింగింప నామె

అస్నాతాద్రష్టుమిచ్ఛామి భర్తారం రాక్షసాధిప ॥

'రాక్షసరాజా! నేనిట్లే స్నానము చేయక నాభర్తనుజూడఁ గోరెదను' అనెను అందుకు విభీషణుఁడు తన స్త్రీలమూలమున

యదాహరాజాభర్తాతే తత్తథాకర్తుమర్హసి ॥

'నీకుభర్తయు మనకెల్లరకు రాజునగు రామచంద్రుఁడెట్లు చెప్పెనో యట్లే నీవు చేయఁదగుదువు' అని బదులు చెప్పెను అప్పుడు సీతాదేవి

తస్యతద్వచనంశ్రుత్వా మైథిలీభర్తృదేవతా ।
భర్తృభక్తివ్రతాసాధ్వీ తథేతి ప్రత్యభాషత ॥

యతనిమాటలువిని భర్తయే దైవమనియు భర్తయందలి భక్తియే వ్రతమనియుఁ బాటించు గొప్ప పతివ్రతయగు నామె యట్లే చేసెదనని చెప్పెను అంతనామె స్నానాలంకారములు గావించుకొనఁగా విభీషణుఁడామెను మేలయునట్టి పల్లెకిలోఁ గూర్చుండఁబెట్టి గొప్పపరివారముతో రామునిసన్నిధానమునకుఁ గొంపోయెను ఆమె పల్లెకినుండి దిగివచ్చునపుడు భటులు కఠినముగ వానర భల్లూక సమూహములను దొలఁగిఁ ద్రోయుచుండు శబ్దమువిని రాముఁడు వేడి చూపులతో విభీషణునిఁజూచి

కిమర్థం మామనాదృత్యక్లిశ్యతేఽయంత్వయాజనః ।
నివర్తయైనముద్వేగం జనోఽయం స్వజనోమమ ॥
నగృహాణి నవస్త్రాణి నప్రాకారస్తిరస్క్రియాః ।
నేదృశారాజసత్కారా వృత్తమావరణం స్త్రియాః ॥
వ్యసనేషు నకృచ్ఛ్రేషునయుద్ధేషు స్వయంవరే ।
నక్రతౌ నవివాహేచ దర్శనం దుష్యతిస్త్రియాః ॥
సైషాయుద్ధగతాచైవకృచ్ఛ్రేచమహతిస్థితా ।
దర్శనేఽస్యానదోషస్స్యాన్మత్సమీపే విశేషతః ॥

'నన్నుగమనింపక నీవీజనుల నేల బాధపెట్టెదవు? వీరు నా జనులు కావున వీరిని తొలఁగఁద్రోయుఁ బూనిక వదలుము గృహములు, వస్త్రములు, గోడలు, రాజమర్యాదలు మొదలగునవి స్త్రీల సంరక్షించునవిగావు వారి నడవడియే వారికి ముఖ్యాభరణము అదియేవారిని రక్షించును బంధుజనుల మరణకాలమునను, యుద్ధసమయమునను, స్వయంవరమునను, యజ్ఞకార్యములందును వివాహకాలమునను, స్త్రీలు, పురుషులకగపడుట దోషము గానేరదు ఈ సీత యిప్పుడు యుద్ధభూమిలోనున్నది మిక్కిలి కష్టపరిస్థితిలోనున్నది అందులో నా సమీపమున నున్నది కావున నిప్పుడీమె నితరులు చూచుట దోషముగాదు

తదానయ సమీపంమే శీఘ్రమేనాం విభీషణ ।
సీతాపశ్యతు మామేషా సుహృద్గణ వృతం స్థితమ్ ॥

ఆదిత్య లింగ పద్మ అగ్ని కూర్మస్కంద గరుడ పురాణ ఉపపురాణములను విరచించి అందు దశవిధ లక్షణములు గలవి మహాపురాణములనియును, పంచ విధ లక్షణములుగలవి అల్పపురాణములనియు నత్యంత ప్రజామనోరంజకములుగ సలిపి స్వశిష్యుడు సూతుండునగు రోమహర్షణ మహామునికి ప్రబోధించియుండెను పురాణప్రవచనము సల్పి ప్రజలను పులకాంకితుల జేయుట చేతనే యా సూతునికి రోమహర్షణ మహామునియని పేరుగలిగి యుండెను అట్టి రోమహర్షణుడగు సూతపౌరాణికాగ్రేసరుడే పురాణ శ్రవణాదుఃవల్ల ప్రపంచ మానవులెల్లరు స్త్రీ పురుషాది వర్ణాశ్రమాచార వ్యవహార భేదము లేకుండగ, తపోదాన యజ్ఞాదులాచరింపక పోయినను ఇహాపర సౌఖ్యము లనుభవించి తరించెదరన్న భావముతో త్రయ్యారుణి, కశ్యపసావర్ణి, అకృతవ్రణ, వైశంపాయన హారీతులను నారుగురు మునులకు పురాణములెల్ల బోధించి తచ్ఛిష్య ప్రశిష్యుల ద్వారా పురాణ ప్రచారము గావించి యుండెను అట్టి రోమహర్షణ శిష్య ప్రశిష్య పరంపరలోనివారే యీ నాటి సకల ప్రజా మనోరంజకముగా పురాణప్రవచనములు సలుపు మహా పౌరాణికులు, పురాణ ప్రవక్తలున్ను, కాబట్టి కలియుగమున ముక్తికి ముఖ్యసాధనములే మహాపురాణ ఉపపురాణ శ్రవణాదులు



*Edited and Published by M Chandramouli Reddy, Executive Officer Tirumala Tirupati Devasthanams and Printed at T T D Press Tirupati*

Visit **MANGAPURAM**

*DURING*



# Sakshatkara Vaibhava Festival

OF

## SRI KALYANA VENKATESWARA SWAMY

# On 11th July 1970.

★Mangapuram is situated at 6 miles from Tirupati on Tirupati Bakarapet Route